Registered No. M-4345

# యుద్ధ సంచిక.

వాల్యుం II]. 1942 వ సం॥ ఏప్రిల్ నెల 3 వ తేది శుక్రవారం [నె 13 రు.

## రాజుగారి సందేశం.

బ్రిటిషు చక్రవర్తి జార్జి రాజుగారు గత ఆది వారంనాడు సామ్రాజ్యమంతట ప్రార్థనలు చేయ గోరుచు రేడియో ప్రసంగం గావించిరి. అం దిట్లు చెప్పిరి :—

"నేను గతసారి యీ రేడియో ద్వారా ఉప న్యసించి నప్పటికి, యిప్పటికి చాల ఆందోళనకర మగు పరిస్థితులు గడచినవి. మన పతాకం క్రింద నుండి చిరకాలం శాంతి సంపద సౌఖ్యములు అనుభవించినవారు యిపుడు యుద్ధంలో చిక్కు కొని బాధపడుచున్నారు. వారి దుఃఖంలో మనం పాల్గొనుచున్నాము. ఆస్ట్రేలియా, న్యూజి లండు, ఇండియా, బర్మాలందున్న సోదరుల కష్ట సమయమునందు వారియెడల సానుభూతితో మన హృదయములు కరిగిపోతున్నవి. ఈ మాతృదేశమున ప్రజలెంత ధైర్యంగా కష్టాలు ఓరుస్తున్నారో వారును అంత ధైర్యంతోనే ఓరు స్తున్నారు. మన శక్తికొలది వారికి తోడ్పడె దము. అమెరికా సైన్యాలపుడే వారి చెంతకు వచ్చినవని వినుటకు సంతసమగుచున్నది.

### హృదయ పరిశోధనం.

ఈ విషాద సమయమునందు అనేకసారులు హృదయ పరిశోధనము జరిగెను. అది మం చిదే. ఏమన, కష్టాలను బాగుగ పరిశీలించి యింతకన్న ఎక్కువకృషి చేయుటకు ప్రోత్సాహ కరంగా వినియోగించుటకు వీలుంది. అపుడే చాల సాధించితిమి. ఇంతవరకు చేసిన కృషిని యీసడించుట పొరబాటు. అది మనకు, మిత్ర రాజ్యములకుగూడ అపచారమగును. ఇపుడు న్నంత ఐకమత్యంతో యింత ఎక్కువ కష్టపడి మనదేశం యిదివరకెన్నడు పనిచేయలేదు. అట్ల నగా యింకా యెక్కువ చేయలేమని కాదు. సమష్టి కృషి యింకా యెక్కువ చేయాలి, చేయ గలము. ఆధునిక యుద్ధానికి శీఘ్రగమనమే ముఖ్యసాధనము. ఈ బాధ్యత కేవలం అధి కారులపైనే లేదు, మనలో ప్రతివారియందు ప్రతివృత్తికి చెందినవారిపైన కలదు. ప్రతివారు తన శక్తికొలది తనపని చేయవలసియుండును. ఒండొరులయందు నూతన విశ్వాసంతో, నూతన ఉత్సాహంతో శక్తితో యీ క్లిష్టసమయమునందు ప్రతివారు పనిచేయాలని నేను కోరుచున్నాను. మనమంతా తప్పులు చేస్తూవుంటాము. ఇతరుల తప్పులను ఎంచుటకు కాలం వృథాచేసేలోపల మనం చేయదలచిన సేవంతా చేసేమో లేదో తెలుసుకోవాలి. ముందుమార్గం ఎంత కంట కంగా ఎంత అగమ్యంగానున్నా, స్థిరచిత్తంతో సాగిపోతూనే వుంటామని నాకు నమ్మకంగలదు.

### గమ్యస్థానం చేరువైంది.

రెండున్న రేండ్ల క్రిందట కొండెక్కుటకు పాదంవద్ద ప్రయాణం ప్రారంభించినపుడున్నంత ఉత్సాహం యిప్పుడు మనలో కొందరికి లేనిమాట నిజమే. కాని మనం కొండశిఖరం చేరువకు వచ్చేమని మరువరాదు. కొండెక్కుచున్న కొలది మన నరాలు బిగువై, కండలుబలసి, గుండె దిట్ట పడుచున్నది. ప్రతిచోటను మన మెదిరించు చున్న దుష్టశక్తుల పీడను తొలగించుచున్న కొలది కష్టాలోర్చుకొనే శక్తి మనకు ఎక్కువగు చున్నది.

దుష్ట శక్తులను ధ్వంసంచేయుటకే మనం పవిత్రమయిన యుద్ధం సాగించుచున్నాము. ఆ శక్తులు నిలచియున్నచో స్వాతంత్ర్యం, సహనం, ఔదార్యం ఎన్నోతరాలవరకు లేకుండా పోవును, ప్రపంచ వినాశం తెచ్చిపెట్టుచున్న దుష్ట శక్తులు పూర్తిగ నాశనమయితేనేగాని శాంతి నెలకొనదు, విదేశాలందున్న మన సోదర సోదరీ మణుల సౌహార్దముతో, మిత్రదేశముల వీరత్వం సహాయంతో, మన కార్యం సాధించేవరకు ముందుకు సాగిపోతూ వుంటాము.

పూర్ణవిశ్వాసంతో, ఎంతటి త్యాగమయినా చేయు స్థిర సంకల్పంతో, ధర్మవిజయమునకు సాగిపోవుదము. అప్పుడే అందరికి వాగ్దానం చేసిన మంచికాలము చేకూరగలదు.''

---

# యుద్ధ విమర్శ—విశేషాలు.

జర్మనీ తప్పుడు ప్రచారం.

పశిఫికు సముద్ర యుద్ధంలో కొంచెం ఓడి బ్రిటను అమెరికాలు తల వంచియున్న యీ సమయంలో రష్యానుగూర్చి వారి మనస్సులో అనుమానం కలిగించుటకు జర్మనీ ప్రయత్నం చేస్తున్నది. ఎర్ర సైన్యం వార్షికోత్సవం సమయమున రష్యా నియంత స్టాలిను ఒసంగిన ఉపన్యాసానికి పెడార్థములను ప్రచారం చేస్తున్నది. రష్యా దేశభాగములను శత్రు వశమునుండి తప్పించుటే ఎర్రసైన్యం కర్తవ్యమని ఆతడు చెప్పియుండెను. ఈ మాటల కర్థం స్పష్టంగా తెలుస్తూవుండగా, హిట్లరు తత్వం పడగొట్టి యూరోపులో అతనిచే ఆక్రమింపబడిన దేశాలను విముక్తి చేయడం సంకల్పం స్టాలిను వదలుకొని, తన దేశ భాగాలనుండి జర్మనీ సేనలను పోగానే సంధి చేసుకోడానికి సిద్ధంగా యున్నాడని ఒక ప్రచారం ప్రారంభమయింది. ఇది జర్మనీదృష్టిలో సబబుగనే కనబడవచ్చును. కాని స్టాలిను బలవత్తరమగు కమ్యూనిష్టు రాజ్యం సంపూర్ణమయినది స్థాపించుటకే సంకల్పించెనని ప్రపంచంలో అందరికి తెలుసు. అతడా కార్యమును, దానికి ప్రతికూలమైన జర్మనీ ఉపద్రవమును తొలగించినగాని సాధించలేడు. జర్మనీ నెదుర్కొనుటకు తనకు మిత్రులుగ నుండదగ్గవారి నాశనమునకు సహాయకారియైనచో తనకుగల నాజీ ముప్పును యికముందెన్నడు అతను తొలగించుకోలేడనిగూడ జగద్విఖ్యాతమే.

స్టాలిను హిట్లరుతో ప్రత్యేకంగా సంధిచేసుకొని, జపానుతోగూడ బేరంపెట్టి; జర్మను సైన్యాలకు యింకోవైపు చికాకులేకుండా ఇంగ్లాండుపై దాడికే అంతశక్తీ వినియోగించుటకు అవకాశమిచ్చునని, యింకోరకం జర్మను ప్రచారం జరుగుచున్నది. కాని సైబీరియాలో మంచుకొండలు దిగి పనుల కాటంకం కలిగేలోపలే రష్యా నెదిరించాలని జపాను చూస్తున్నట్లు చీనావారు దలంచుచున్నారు. అందుకు నిదర్శనంగా రష్యాలోనున్న జపాను రాయబారి జనరలు టటకావగారు, కొరియా గవర్నరు జనరలుగారు, మంచుకో ప్రధాన మంత్రి అందరు ఒకేసారి జపాను ముఖ్య పట్నమగు టోకియోకు రప్పించబడిరి. ఈ వసంత ఋతువులోనే రష్యాకు ఒకవైపు జర్మనీ ఇంకోవైపు జపాను ఎదిరించినా ఎదిరించవచ్చును. అంతమాత్రం రష్యాకు భయంలేదు. రష్యా యొక్క ఎర్రసేన తూర్పున విశేషంగావుంది. దానికి సరకు పడమరనుండి రానక్కరలేదు. అంతా తూర్పు రష్యాలోనేవుంది. అంతేకాక రష్యాపై జపాను యుద్ధానికి దిగినచో వ్లాడివిస్టాకు రేవునుండి రష్యా బాంబులువేస్తే కాగితము కర్రలతో కట్టిన జపాను నగరాలన్ని మండి వూరుకుంటాయి.

రష్యాకు దక్షిణంగానున్న టర్కీలో యింకోవిధమగు జర్మనీ ప్రచారం సాగుచున్నది. టర్కీ బలంగానుండి రష్యాను ఎదుర్కొనగలిగియుంటే జర్మనీకి లాభం. అందుకొరకు టర్కీకి ధైర్యం చెపుతూ, జర్మనీగాని బల్గేరియాకాని నీమీదకు రావని ప్రచారం చేస్తున్నది. అయితే టర్కీ ప్రభుత్వం యీ మాటలు నమ్మలేదు.

బల్గేరియా రష్యా.

బల్గేరియా రష్యాపై యుద్ధంచేయునా? చేసినా చేయవచ్చును. యూరోపు ఆగ్నేయదిక్కునవున్న దేశాలన్నింటిని తన వసంత ఋతువు

యుద్ధంలోదింపుటకు హిట్లరు ప్రయత్నిస్తున్నాడని రూఢిగా తెలుస్తున్నది. టర్కీ ముఖ్యపట్టణ మగు అంకారాలోనున్న జర్మను కార్యాలయం ఏం ప్రకటించిందంటే, వాను పాపనుగారు బల్గేరియా రాజు బోరిసుగారును హిట్లరును స్వయం గాచూచి, రష్యాపై యుద్ధంలో జర్మనీతో బల్గేరియా చేరినయెడల టర్కీ ఏమనుకుంటుందీ, అని చర్చించారట. బల్గేరియా రష్యాపై యుద్ధం చేస్తుందని జర్మను అధికారులేచెప్పడం ఇదే మొదలు. బల్గేరియాలో 24 క్రొత్త విమానాశ్రయాలు, 50 మైదానాలు జర్మను ఇంజనీరులు సిద్ధంచేసేరట. జర్మను సేనలు, బల్గేరియా సేనలు క్రొత్తగ వేసిన రోడ్లమీదుగా సరిహద్దులవద్ద చేర్చబడినవి.

**ఎత్తులు తప్పుట**

జర్మనీ నిలవయుంచుకొన్న సేనలన్నింటిని రష్యా యుద్ధరంగానికి పంపవలసి వస్తున్నది. తరిఫీదు కాని సైనికులు అదివరకు రిజర్వులో నుంచబడినవారు 400,000 మంది యుద్ధరంగానికి పంపబడినట్లు మాస్కోనుండి ప్రకటించబడెను. తిరుగు దాడులకై జర్మనులు అనేక డివిజనుల సైన్యాన్ని ఉపయోగిస్తున్నారు. స్మోలిం‌స్కవద్ద పట్టుదలతో పోరాడుచున్నారు గాని ఏమి లాభంలేకపోయింది. రష్యా సేనలు స్టరయా రస్సా, వైయాజ్మ, కార్కోవు నగరాలపై చొచ్చుకపోతున్నవి. పది రోజుల యుద్ధంలో జర్మనుల విమానాలు 306 నష్టమయినవి. రష్యనులవి 118 పోయినవి. జర్మను విమానాలు చాల మధ్యధరా సముద్రం వైపు పంపబడుటచే రష్యావిమానాల సంఖ్య జర్మనుల సంఖ్యకన్న ఎక్కువయుండవచ్చును, జనవరిలో మార్షలు కేసలురింగుగారి విమానదళమంతా సిసిలీకి పంపబడెను. ఇంకో విమానదళం పునరుద్ధరణకై ఒక నెలక్రిందట జర్మనీకి పంపబడెను. ఆరునుండి ఎనిమిది వేలవరకు జర్మను విమానదళాలు క్రమేణ గ్రీసులోనికి, డొడకనీసు, దక్షిణ ఇటలీలకు మార్చబడుచున్నవి. వాటితోబాటు కాల్బలం సైనికులను రవానాచేయు పెద్ద గ్లైడరు విమానాలు గూడ పంపబడుచున్నవి. విమానాలు గాలిలో పంపుటకు చమురు చాలక రైళ్ళలో పంపుచున్నారు. ఈ వేసంగి యుద్ధానికి సరిపోవునంతే పెట్రోలు చమురు జర్మనీకిగలదు. క్రొత్తగా తయారుచేస్తున్న కృత్రిమ చమురు యింకా రెండేండ్లవరకు తయారుకాదు. బ్రిటిషు విమానాలు పదమట జర్మనిలోని కర్మాగారాలపై బాంబులు వేస్తూవుంటే అది తగ్గిపోతుంది.

**రష్యా యత్నం.**

వయజ్మ, కార్కోవు నగరాలందు హిట్లరు తన మందుగుండు, టాంకులు విశేషంగా లారీలు నిలువయుంచేడు. వసంతకాలం యుద్ధానికి సిద్ధంగా జతపరిచేడు. కావున ఆ రెండు నగరాలవద్దనే అతి తీవ్రమగు యుద్ధం యిపుడు జరుగుచున్నది. పోలెండు, తూర్పు ప్రష్యా ప్రాంసులనుండి క్రొత్తగా జర్మను సేనలు వచ్చుటవలన శత్రునిరోధం ఎక్కువయింది. వియజ్మా, కార్కోవు నగరాలకు వెనుక రాధారులు నిర్నిరోధంగా నుండుటచే సప్లైలు చేరుచున్నవి. అందుచే ఎదురుగావచ్చుదాడిని దీర్ఘకాలం నిరోధించగలవు. కాని ప్రక్కన ఉన్న కట్టడములు గట్టి లేనందున రష్యనుల టాంకులు ఫిరంగుల దాడికి నిలువజాలకున్నవి. వియజ్మ, కార్కోవులను వశం చేసికొనుట సులభం కాదు. సులభమని రష్యను నాయకు లెప్పుడు అనలేదు. కాని ఆ నగరములను ముట్టడిచేసి, రక్షణములెక్కడ నీరసంగావున్నవో అక్కడ కొన్ని వారాలపాటు దాడిచేసి, ఒత్తిడి కలిగించి, విసిగించి గెలవాలని వారి యెత్తు మొజేయిస్కనందు రష్యనులు యిటే గెలిచిరి.

స్టరారసాలో చుట్టివేయబడిన జర్మనులును, ఓరలు, రజావ్ లందున్నవారును అమితకష్టాలు పడుచున్నారని తెలియుచున్నది. వారికి నేలనుండి సహాయం చేరే మార్గమేలేదు. 52 విమానాలు రష్యను విమానాలను తప్పించుకొని తిరుగుచు సరకు అందిస్తున్నవి. జర్మను సైనికులచట డబ్బాలలోనుండు తినుబడి పదార్థములపై బ్రతుకుచున్నారు. వారికి తాజాకాయగూరలు కాని, మాంసం, పండ్లు, రొట్టెగాని నాలుగు వారాలనుండి లేవు. అలసియున్నారు. రాత్రులందు రష్యను విమానదాడులవలన మంచులో జారివచ్చు సైనికులు విసరు చేతిబాంబులువేసి పారిపోవుచుండు రష్యను సైనికులవలన వారికి నిద్రయే పట్టకుండాయుంది. ఓరల్, రోజవ్ లందు జర్మను సైనికులలో రక్తవిరోచనాలు మున్నగు రోగాలు బయలుదేరినవి.

జర్మనీలో ప్రజల కిచ్చు ఆహారపదార్థముల కొలతలు తగ్గించుటగూర్చి జర్మను ప్రచారకమంత్రి గోయిబెల్సుగా రొక వ్యాసం వ్రాసిరి. అందుకు వారు ఎనిమిది కారణాలు తెలిపిరి. జర్మను సైన్యం విపరీతంగా పెరిగింది దానికి తిండి కావాలి. గత రెండేండ్లలో పంటలు బాగులేవు. వ్యవసాయపు కూలీలు దొరకుట లేదు. ఇవి కొన్ని ముఖ్య కారణాలు. అందుచే ఉన్న ఆహారపదార్థాలను పంచియివ్వడంలో అతి జాగ్రత్తగ నుండిరి. ముడిపదార్థాలను, యితర అవసరమగు వస్తువులను దాచియుంచుకొనువారు ఉరిశిక్ష విధించబడుదురని జర్మను మంత్రివర్గం వారు ఉత్తరువు చేసిన విషయం గోయిబెల్సు గారు జ్ఞాపకం చేసిరి. యుద్ధంలో ఓడిపోతే యికముందు వచ్చే కష్టాలతో పోల్చి చూస్తే యీ కష్టాలు ఏమీ యెక్కువ కావని వారనిరి.

గోయిబెల్సు ప్రచార ధోరణి మారింది.

కొంతకాలంనుండి గోయిబెల్సుగారి ప్రచారంలో మార్పు కలిగింది. రష్యాలో కలిగిన నష్టాలకు జర్మను ప్రజలను తయారుచేస్తున్నాడు. అక్కడ చలిలో బాధపడుచున్న తమ సేనలకు చలిబట్టలు ప్రజలు యివ్వాలని ప్రకటించిన విన్నపం వృధాకాకుండుటకై తంటాలుపడెను. వసంత ఋతువు యుద్ధంలో ఏమోచేసి పొడిచేస్తామని ప్రగల్భాలు చెప్పి ప్రజల ఉత్సాహం రేకెత్తించడం యిప్పటి పరిస్థితులలో ప్రమాదకరమని గుర్తించెను. ప్రజలలో ఉత్సాహంలేదు. కావున ఉన్న ధైర్యం పోకుండా చూసుకోవాలి. అందు కొరకై జర్మనీకి త్వరలో ముప్పురానున్నది. జర్మనీ ప్రజలు అమానుషమైన కృషిచేసి దాన్ని తప్పించాలని విన్నవించుట ప్రయోజనకరంగా వుంటుందని అతడు తెలుసుకున్నాడు.

---

# భర్తతోగూడ యుద్ధానికి పోయిన చీనా భార్య.

## గ్రామ పెద్దల నిర్ణయం.

### గృహధర్మంకన్న జాతీయధర్మం ఎక్కువ.

దక్షిణ చీనాయందు క్వాంగ్సిలోనుండి యీ దిగువ వార్తవచ్చింది. క్రొత్తగ పెండ్లిచేసుకున్న సిపాయి ఒకడు యుద్ధంలో గాయపడి బాగయినాక తిరిగి యుద్ధానికి పోవడమా మానడమా అన్న సందేహం కలిగింది.

అతనిపేరు వాంగులియు టింగే. చాంగ్షానగరం యుద్ధంలో గుండుదెబ్బ తగిలి, స్వగ్రామంలో మందు వేయించుకొనుటకు పంపబడెను. బాగై తిరిగి యుద్ధానికి తయారుగనున్నపుడు అతడు తన భార్యను పిలచి, మరల తాను సైన్యంలో చేరుటకు పోతాననెను. ఆమెకు యిష్టం లేక పోయింది. నువ్వు యుద్ధానికెళితే నేను నుయ్యో గొయ్యో చూసుకచస్తానంది. అతనెంత చెప్పినా ఆమె వినననందున, యీ విషయం గ్రామ పెద్దలికి చెప్పి వారెలాచెపితే అలాచేద్దామని భార్యా భర్తలిద్దరు నిశ్చయించుకున్నారు.

గ్రామ చావడిలో పెద్దలందరి ముందర సిపాయివాంగు తానెందుకు తిరిగి యుద్ధానికి పోతానంటున్నాడో కారణంచెప్పి, దేశంకొరకు సేవ జేయక తప్పదని తన అభిప్రాయం చెప్పెను. తరువాత అతని పెండ్లాం తానతనితో ఉండక తప్పదని ఏడుస్తూ చెప్పింది.

అంతట ఆ విషయం పెద్దలందరు ఓటుచేసి నిర్ణయించాలనుకున్నారు. సైనికుని ప్రధానధర్మం దేశం కొరకు పాటుబడుట. భార్యాయెడల ధర్మం నిర్వహించడం రెండో పద్ధతి అని పెద్దలందరు ఏక గ్రీవంగా నిర్ణయించిరి.

వెంటనే ఆ భార్యా, తానెంత వాదించినా లాభం లేదనుకోని, కండ్లు తుడుచేసుకొని, అందరికి ఆశ్చర్యం కలుగునట్లు " నాథర్త వెళ్లక తప్పదు కనుక, నేనూ అతనితో వెళ్ళిపోతాను " అంది.

ఆమె చివరికి అట్లే చేసెను.

ఆమె భర్త సైనికుడుగానున్న సైనికదళంలో ప్రథమ చికిత్స జట్టులోనుండి ఆమె కూడా సైన్యం సేవ చేస్తున్నది.

# బ్రిటిషు స్త్రీల యుద్ధ సహాయం.



బ్రిటిషు విశ్వవిద్యాలయాలలో శాస్త్రాలనేర్చిన స్త్రీలు సైన్యానికి తోడ్పడుచున్నారు. ఈ పటంలో ఒక స్త్రీ సైనికులు సముద్రంలో శత్రునావలను కొట్టే ఫిరంగి గుండ్లు సరిగావున్నాయో లేదో పరిశీలిస్తున్నది.

---

# పశిఫికు యుద్ధం.

## జపాను విషవాయువు నుపయోగించుట

మిత్రమండలి విమానాధిక్యత.

పశిఫికు సముద్రయుద్ధమునందు గతవారం చాలముఖ్యమైన సంఘటనలు జరిగినవి. కొన్ని ప్రాంతాలలో మిత్రమండలివే పై చేయిగానుండని వాటివలన రుజువయింది. బర్మాలో యుద్ధం చేయుచున్న చీనా సేనలు టోంగూ తూర్పు భాగమున శత్రుసేనలసంఖ్య తమ సంఖ్యకు రెండింతలున్నప్పటికీ, ఆ భాగం తమక్రిందనే ఉంచుకో గలిగినవి. దానిబట్టి చీనాసేనలు ఎంతబలవత్తరమయినవో తెలియగలదు. అధికంగా ఉన్న జపాను సేనలు, విమానాలు, టాంకులు ఫిరంగుల సహాయంతో కూడవచ్చియు, అటనుండి చీనాసేనలను తొలగించలేకపోయింది. అయితే టోంగూవద్ద జరిగే యుద్ధం జపానుయొక్క ప్రధాన సేనలతోనే కాదు. ముందుగావచ్చిన కొద్దిపాటి సేనలతోనే జపాను ప్రధాన సైనికదళం యింకా ఉత్తరానికివుంది. సముద్రమార్గమున జపాను సైన్యం ఒక డివిజను (12,000 సుమారు) వచ్చియుండెను. టోంగూ—యదషిలమధ్య యిపుడు తీవ్రంగా యుద్ధం జరుగుచున్నది. యదషి టోంగూనకు ఉత్తరమున 20 మైళ్ళ దూరంలో వుంది.

### విషవాయువు ఉపయోగించుట.

రైలు మార్గము ననుసరించియున్న తావులందు స్థిరంగా నిలచియున్న చీనా సేనలను తరిమివేయుటకు టోంగూ ప్రాంతాలలో జపానువారు విషవాయువు నుపయోగించిరి. అన్యాయమును అధర్మమును యీదారుణ రాక్షసకృత్యం కూడా చీనాసేనలను కదిలించకపోయెను. జపానువారు యిదివరకు మధ్య చీనాలో చాంగ్షయుద్ధమునందు విషవాయువును ఉపయోగించియుండిరి.

టోంగూ నగరం యింకను ఆఫ్రికాలో టాబ్రుకు నగరంవలె శత్రుముట్టడిని నిరోధించి నిలచియున్నది. విరామంలేకుండా బాంబులు, గుండు పడుచున్నా బయటనుండి సహాయం వచ్చుటకు

వీలులేకున్నా అందున్న చీనా సైనికదళం తీవ్రంగా యుద్ధం చేయుచునేయున్నదని బర్మాలో సైన్యం కూడనున్న విలేఖరి వ్రాసెను. టోంగూ, బర్మా దేశానికి గుండెకాయవంటిది. చీనా సేనలు తిరుగుదాడులు జరిపి నాంగ్యుము, క్యంగాను విమానాశ్రయములను వశపరచుకొని సైనిక శాసనం అచట ప్రకటించిరి. జపాను సేనలకు క్రొత్తగా సహాయం చేకూరినందున తీవ్రదాడులు జరుపుచున్నా, చీనా సేనలు తరిమివేస్తున్నవి.

ఐరావతీ ప్రాంతములందు మిత్రమండలి సేనలకు కొంచెం పని కల్పించుటకై జపాను చర్యలు జరుగుచున్నవి. ఇచటకు శత్రుసేనలు మూడు మార్గములుగ వస్తున్నవి. ఒకటి ప్రోము రోడుమీదుగను యింకోటి ఐరావతినది తూర్పు తీరం ననుసరించి మూడోది నది పడమర తీరం ననుసరించి వస్తున్నవి. జపానువారిని బ్రిటిషు టాంకులు చాల నష్టం కలిగించి వెనుకకు నెట్టివేసినట్లు వార్తలు వచ్చినవి. అందుచేత యిచట నష్టపోయిన విమానాలను భర్తీచేయుటకు యితరచోట్ల నున్నవి తెప్పించవలసి వస్తున్నది. అందుచే అచటి పనులకు ఆటంకం కలుగుచున్నది.

మిత్రమండలి విమానాధిక్యత.

న్యూగినీ, న్యూ బ్రిటను దీవులందు శత్రు విమానాలకన్న మన విమానాలు ఎక్కువయినది. అందుచే జపాను చర్యలు యితరచోట్ల వెనుక బడినవి. అక్కడనుండి విమానాలు న్యూగినీ ప్రాంతాలకు రప్పించబడుచున్నవి.

మార్చి 10 వ తేదిన న్యూగినీలోని పీపురము పై మన విమానాలు బాంబులు వేయుట చేతను, తరువాత దాడిచేయుటచేతను జపాను వారి క్రూయిజరు యుద్ధ విమానాల సంఖ్య నూటికి 10 వంతు తగ్గిపోయింది. 40 జపాను బాంబరులు ఆస్ట్రేలియా చేరువ ప్రాంతాల కూలి పోయినవి. ఇందువలన యుద్ధవైఖరి పూర్తిగ మారి పోగలదు.

వారివి 100 విమానాలు, 50 స్టీమరులు మునిగేయి.

న్యూబ్రిటను దీవి ముఖ్యపట్నమగు రాబూలు రెండు నెలల క్రిందట జపానువశమయినప్పటి నుండి, జపానువారు శత్రువుకి కలిగించిన నష్టం కన్న తామే ఎక్కువ నష్టంపోతున్నారు. ఇంత వరకు జపానువారి విమానాలు 100, నౌకలు 50 అన్ని రకాలు కలిసి మునిగిపోయినవి. ఇవి కాక యింకా ఎన్నో చెడినవి. న్యూగినీ, న్యూ బ్రిటనులందు శత్రువశమయిన స్థలములపై విరామం లేకుండ మిత్రమండలి విమానాలు బాంబులు వేస్తూ, అచట శత్రువు తన సేనలను శక్తిని కూడ దీసుకొనుటకు అవకాశం యివ్వడంలేదు. తక్కువ విశ్రాంతితో ఎక్కువ పనిచేయుచు గూడ రాయలు ఆస్ట్రేలియను వైమానికులు అత్యంత ఉత్సాహంతో నున్నారు.

శత్రువులు ఆస్ట్రేలియాలోని ఉత్తర దిక్కున ఉన్న రేవు స్థలమగు డార్వినుపై మార్చి 31 వ తేదిన ఎనిమిదోసారి బాంబులువేసిరి, అచటి విమానాశ్రయంపై గురిచూచిరి గాని ఏమి నష్టం కలుగలేదని ప్రధానమంత్రి కర్టినుగారు తెలిపిరి. ఆస్ట్రేలియాకు చేరువగనున్న న్యూగినీ రేవు స్థలమగు పోర్టుమోర్సుబీపై జపాను విమానాలు వేగు తిరిగినవి. దిగువ ఫిరంగుల గుండ్లకు గురియైనవి. మోరస్బీ ప్రాంతాలలో మార్కాంలోయ యందు వారాక్రమించిన ప్రాంతాలలో నది వరదగా వచ్చి ముంచి వేయుటచే జపాను సేనలు ఖాళీ చేయవలసివచ్చెను. అందుచే మార్సుబీ రేవుపై శత్రువు ఒత్తిడి తగ్గింది.

పశిఫికుయుద్ధ సమాలోచన సంఘం.

అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు వాషింగ్టను నగరంలో పశిఫికు యుద్ధ సంఘం నియమించినట్లు ప్రకటించిరి. అందు ఆస్ట్రేలియా, న్యూ ఇంగ్లాండు, అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రతినిధులుందురు. మొదటి సభ ఏప్రిలు 1 వ తేదిన జరుగును. పశిఫికు యుద్ధమునందు ప్రస్తుతం పాల్గొనుచున్న దేశాలన్నీ కలసి సమిష్టి యత్నం గూర్చి ఆలోచించుట అవసరమని రూజువెల్టుగారు దెలిపిరి. ఇందు సంబంధించిన దేశాలన్ని పూర్తి సహకారంతో, అర్థంచేసుకొని కృషిచేసినపుడే యుద్ధం బాగుగ నెరవేరగలదనిరి. లండనులో గూడ యిటువంటి సంఘం యేర్పడు ననియు దానితో తమ సంఘం తరుచు సంప్రదించుచుంటుననియు వారు దెలిపిరి. ఆస్ట్రేలియా ప్రధాని కర్టినుగారును, కనడాయును యీ సంఘ నియామకమునకు ఆమోదమునకు సంతసమును వెలిబుచ్చిరి.

## గాలి గుమ్మటాలలో దిగడానికి నేర్చుకొనుటకు నిర్మించబడిన గోపురం.



విమానాలనుండి గాలి గుమ్మటాలలో దిగడం సైనికులకు నార్వేవిధం యిందులో కనబడుతుంది. ఎత్తైన గోపురం కట్టి దాని కొననుండి సైనికుడు గాలిగుమ్మటం (పారిషూటు) సహాయానా దిగుతున్నాడు. ఇది నేర్చుకోడం కనుక అతని గుమ్మటానికి గోపురానికి కలిపి ఒక తీగ కట్టియున్నది.

---

### జపాను కాళ్లు పీకుతున్నాయి.

జపానువారు అంతకంతకు అతి దూరంగా సముద్రాలు దాటుతూవుంటే అమెరికా నౌకాదళం బాగా బుద్ధి చెప్పుచున్నది. అందువలన జపాను వారి స్వదేశానికి శత్రు దాడి ముప్పు ఎక్కువగుచున్నది. జపాను వశమయిన వేకు దీవులు మార్కసు దీవులపై అమెరికా నౌకాదళాధికారి అడ్మిరలు హాల్సీగారు దాడి వెడలినపుడు 3,500 మైళ్లు పశిఫికు సముద్రమార్గమున పోగా త్రోవలో ఒక్క జపాను యుద్ధనౌక అగుపడింటే వారికి యుద్ధ నౌకలు ఎంత తక్కువగానున్నవో తెలియగలదు. వేకు దీవులకు విమానదాడి రక్షణ యేమీలేదు. ఈ రెండు అంశాలబట్టి చూస్తే జపాను అతి దక్షిణ సముద్రాలలో కొన్ని దీవులా క్రమించుటకు ఎంతనౌకాశక్తి వృధా చేసుకుందో తెలియగలదు.

హిందూ మహాసముద్రంలో అండమాను దీవులను వశపరుచుకొనుట టోకియోపై అమెరికా దళాలు దాడివస్తే రక్షణకేమి తోడ్పడజాలదని మాంచెస్టరు గార్డియను పత్రిక విలేఖరి వ్రాసెను.

ఇవన్నిచూస్తే దురాక్రమణకు గడంగిన జపానుకి కష్టదశ, మిత్రమండలి తిరుగు దాడి ప్రారంభించకముందే, ప్రారంభమయిందని చెప్పవచ్చును.

# బర్మా రక్షణార్థులు.

## సహాయం చేయడంలో జాతిభేదాలు గమనించలేదు.

బర్మానుండి విధిలేక ఇండియాకు పరుగిడి వచ్చుచున్న రక్షణార్థులకు సహాయం చేయడంలో అధికారులు ఇంగ్లీషువారికి తెల్లవారికి సౌకర్యాలు కలిగించి, భారతీయులకు తగిన సౌకర్యాలు చేయక అన్యాయం చేస్తున్నారని వార్తలు ప్రబలియున్నవి. అవన్ని విని సహించలేక ఒక "భారతీయుడే బర్మానుండి వచ్చినవాడు" మదరాసు మెయిలు పత్రికకు యథాస్థితి తెలిపెను.

అతడు మార్చి 12 వ తేదిన 50 మందితో కలసి విమానంలో బర్మానుండి ఇండియాకు వచ్చెను. విమానాలు రోజుకి నాలుగుసారులు తిరుగుచు ఒక నాటికి 200 మందిని బర్మానుండి ఇండియాకు తెచ్చుచుండెను. విమానంలో ఎక్కించుకొనే విషయంలో జాతివర్గభేదాలేవి పాటించలేదని అతడు తెలుపుచున్నాడు. మొదట్లో డబ్బు చెల్లించ గలిగినవారిని ముందుగ ఎక్కించుకొన్నట్లున్నారు. కాని తరువాత నిరాధారులైన వారిని గూడ ఊరికే ఎక్కించుకొని తీసుకొనివచ్చిరి. చిటగాంగులో వారుచేరిన పిదపవచ్చిన వారందరికి ఔదార్యంతో చూచిరనియు, చిటగాంగులో యూరోపియను క్లబువారు భారతీయ రక్షణార్థులకు విందుచేసిరనియు, యీవచ్చిన భారతీయుడు చెప్పెను.

చిటగాంగునుండి కలకత్తావచ్చే రైళ్లలో స్థలం చాలనపుడు, ఆంగ్లో ఇండియను, యూరోపియను స్త్రీలకు స్థలమివ్వక మన భారతీయులే ముందుకు త్రోసుకొనివచ్చి ఆక్రమించేవారు. భారతీయులలో ఆడవారందరికి వెంట నెవరో మగవారుంటున్నారుగాని, తెల్లవారికి అట్లు కాదనియు, వారి పురుషులు బర్మాలో ఉద్యోగాలకు ఉండి పోవలసి వచ్చుటచే స్త్రీలు ఒంటరిగావచ్చి చాల యిబ్బందులు పడిరనియు, అతడు తెలిపెను.

బర్మానుండి రోడు మార్గాలు మొదటి ప్రోము—టంగ్యుపు రోడుపై చాల ఘోరాలు జరిగినవనియు, యీ రోడు ఉపయోగించ రాదని ప్రభుత్వంవారు నిరుత్సాహపరచుచుండిరి. ఆ రోడు ప్రక్కలను వందలకొలది శవాలుపడి యున్నవని వచ్చినవారు తెలిపిరి. త్రోవలో నీరులేక చచ్చినవారు, బర్మనుల క్రూరకృత్యాలకు లోనయి అనేకమంది చచ్చిరి. బర్మనులు భారతీయులంటే ద్వేషంచేతను, దోచుకోవాలను ఆశతోను ప్రయాణీకులను దో చేసేవారు, చంపేసేవారు, ప్రయాణీకులు డబ్బా నీరు రూ 3 ల చొప్పున కొనుక్కొని బయలుదేరునపుడే పట్టుకోవలసియుండెను. అది పెక్కుమంది చేయలేకపోయిరి. టాంగ్యుపునందు పురపాలకోద్యోగి రక్షణార్థులకు నీరు యివ్వరాదని ఉత్తరువు చేసెను. అచట తెల్లవాడే ఆ ఉద్యోగంలో వుంటే అంత అన్యాయంగా వుండేదికాదని, మెయిలు పత్రికకు అతడు తెలిపెను.

మాండలే—మనిపూరు మార్గమునందు పోవువారిని లెక్క ప్రకారం వదలుటచేత యీ పక్షపాతం నిందలు వచ్చినవి. ఇచట యీ కంట్రోలు జాతిభేదాలు ననుసరించికాదు. అచట నొక ముఖ్యమయిన రిజర్వాయరు ఉన్నది. అది చెడిపోకుండ నుండుటకై యీ నియమ మనుసరించబడినది. వేరొక రోడు మార్గం ఉండనేవుండని అట్లు చేయబడెను.

---

# గాయపడిన సిపాయిలకు వైస్రాయి యింట విందు.

ఇరిట్రియా, లిబియా, సిరియాలందు యుద్ధం చేసి గాయపడివచ్చిన భారతీయ సైనికులకు యీ నెల 24 వ తేదీ మధ్యాహ్నము ఢిల్లీలో వైస్రాయిగారి స్వంత భవనంలో అల్పాహారముల విందు జరిగెను. కర్నలు బిండను బ్లడుగారు సైనికుల వెంటనుండిరి. జాత్ రాజపుత్ర పంజాబీ ముస్లీము జాతుల సైనికులందుగలరు. వారందరికి వైస్రాయిసతి లినిలితుగో ప్రభ్వి ఆ భవనం చుట్టునున్న తోటలన్ని చూపెను. ఈ విందు సినీమా ఫిల్ము తీయబడెను.

# విమానదాడి రక్షణ ఏర్పాటుల సంస్థ (ఎ.ఆర్.పి.)

## కేంద్ర కార్యాలయం, దాని శాఖలు పనిచేయువిధం.

విమానదాడులు వస్తే ప్రజలు తమంత తాము ఎట్లు రక్షించుకోవాలో తెలుపుటకును, వారిని రక్షించుటకు తోడ్పడుటకును పోలీసు భటులవంటి వారిని క్రొత్తగ తయారుచేసి వారందరిని ఒక సంస్థగనుంచి ప్రతీ ముఖ్యనగరంలో యిపుడు పనిచేయిస్తున్నారు. దానినే "ఎ.ఆర్.పి." అని మూడు ఇంగ్లీషు అక్షరాలలో క్లుప్తంగా వ్యవహరిస్తారు.

ప్రతి జిల్లాలలో దీనికి జిల్లా కలెక్టరే అధికారిగా వుంటారు. ఈ కార్యాలను వారు ఎ.ఆర్.పి. కంట్రోలరు అను హోదాలో చేస్తారు. ఈ సంస్థకు చెందిన ఉద్యోగులందరు కలసికట్టుగా, సంప్రదించుకొని పనిచేయుటకు, త్వరగ పని చేయగల్గుటకు ఒక కేంద్ర కార్యాలయం ఉంటుంది. అందులో వారందరు తరచు కలసి కూర్చొని సంప్రదించుకొంటూ వుంటారు. వారికి ప్రతి మూలసమాచారం త్వరత్వరగా అంచడం అవసరం. ఆ సమాచారం ఆ కేంద్ర కార్యాలయానికి వస్తుంది. అక్కడనుండి వివిధ చోట్లకు సందేశాలు ఉత్తరువులు పోతూవుంటాయి.

కేంద్ర కార్యాలయాన్ని "కంట్రోలు సెంటరు" లేక "కంబైండు కంట్రోలు" అంటారు, లేదా కంబైండు కంట్రోలు రిపోర్టు సెంటరు అంటారు.

వీధి కొకరు లేక రెండేసి వీధుల కొకరు వార్డనులని వుంటారు. వారును, పోలీసులు, తదితర వాలంటీరులు ఎక్కడేనా ఏమేనా దాడి జరిగి నష్టం కలిగిన వివరాలు రిపోర్టు సెంటరులకు తెలుపుతారు. అక్కడనుండి సహాయదళములు, ప్రథమ చికిత్స దళాలు, రెస్క్యూపార్టీలు మున్నగునవి దాడి జరిగిన చోటికి పంపబడుతూ వుంటాయి. రిపోర్టు సెంటరులనుండి కేంద్ర కార్యాలయానికిగూడ సందేశాలు పోతూవుంటాయి, అందుచే అన్ని మూలల ఎక్కడేమి జరుగుచున్నదో కేంద్ర కార్యాలయంలో ఉన్నవారికి తెలుస్తూవుంటాయి.

కేంద్ర కార్యాలయమునందు ఒక గదిలో ఒక నగరపటం వుండును. అందులో వూరులో ఎక్కడెక్కడ రిపోర్టు సెంటరులు, ప్రథమ చికిత్స కేంద్రాలు, ఎ.ఆర్.పి. డిపోలు, వార్డనుల నివాసములు, మంటలార్పు దళాలున్నవో చూపబడును.

విమానదాడివస్తే చేయవలసిన పనులన్నింటిపై జిల్లా కలెక్టరుగు ఎ.ఆర్.పి. కంట్రోలరు గారికి అధికారముండును. వారు ముఖ్యమైన కార్యములను కర్తవ్యమును నిర్ణయించి, రిపోర్టు సెంటరు లెక్కువగనుండే ఒక దానికొకటి ఎట్లు సహాయం చేసుకోవాలో తెలుపుతారు. దిగువ ఉద్యోగులు తమతమ స్థానములందు అధికారం గలిగియుందురు. ఏదేని సందేహంగాని తగవు కానివస్తే జిల్లా కలెక్టరుగారి నిర్ణయంకోరెదరు. ఎలక్ట్రికు నీటి సరఫరా శాఖల ఉద్యోగులుగూడ వీరికి సహాయం చేయుదురు.

ప్లాటింగు ఆఫీసరు.—మ్యాపులో (నగరపటంలో) అన్ని గుర్తులు సరిగావున్నట్లు చూడాలి. దాడి జరిగినచో ఏమేమి కార్యాలు ఎక్కడెక్కడ జరిగేయో ఎప్పటి కప్పుడు గుర్తుపెడుతు పిన్నులు టాబులు గుచ్చుతూవుండాలి. పెద్ద బాంబులు పడినచోట నీలం పిన్నులు, బాంబుపడి యింకా మండుతువున్న చోటున ఎర్ర పిన్నుగుచ్చి మాపులో చూపాలి. ఆయుదంతం ముగిసి, సహాయంచేసిన తరువాత ఆ పిన్నులు తీసేస్తారు. ప్లాటింగు ఆఫీసరుకి ఒక ఉద్యోగి సహాయంగా నుండును.

ఇంసిడెంటు ఆఫీసరని వేరొక ఉద్యోగి ఎక్కడేమి జరిగిందో తెలియగానే వ్రాసి, అచట సహాయకార్యాలు ఏమి జరిగేయోగూడ వ్రాసి యుంచాలి.

టాలీ బోర్డు గుమస్తాయు, రికార్డు క్లార్కు వచ్చిన సందేశాలు వెళ్లిన సందేశాలు గుర్తుగ వ్రాసియుంచుకుంటు, ఎక్కడ ఎటువంటి సహాయ దళాలు సిద్ధంగానున్నయో తెలిసియుండి పై అధి కారులకు చెప్పాలి.

సందేశాలన్ని సరిచూచుటకు యిసేజి సూపర వైజరు అని వేరొకరు ఉందురు. సందేశాల గది యొకటి ప్రత్యేకంగానుండును. ఈ ఉద్యో గులలో కొందరు తమ కేంద్రా కార్యాలయాలలో సర్వదాయుందురు, తక్కినవారు అవసరమైన పుడు అతి వడిగా రాగలిగియుండాలి. విమాన దాడి జరిగితే రక్షించుటకు యింత పెద్దశాఖ ఉద్యోగులు, కార్యాలయాలు కట్టుదిట్టాలు చేయ బడుచున్నవి. వారుచేయు ఉత్తరువులన్ని పుర వాసులు విధిగా అంగీకరించి వారు చెప్పినట్లుచేసి తోడ్పడాలి. లేకుంటే శిక్షలు పడుటేకాక ప్రాణ హానికూడ కల్గును.